శ్రీమత్పరమాత్మనే నమః



# పాండవోద్యోగము

శ్రీ

తిరుపతి

వెంకటేశ్వర కవులు

శతావధానులు



# ఇందువచ్చు పాత్రలు

### 1. వ అంకము

1 సూత్రధారుఁడు
2 మారిషుఁడు
3 అర్జునుఁడు
4 దుర్యోధనుఁడు
5 శ్రీకృష్ణుఁడు

### 2. వ అంకము

1 శ్రీకృష్ణుఁడు
2 పంచపాండవులు
3 ద్రౌపది

### 3. వ అంకము

1 వృద్ధపురోహితుఁడు
2 ద్వివేది
3 ధృతరాష్ట్రుఁడు
4 భీష్ముఁడు
5 నారదాదులు
6 శ్రీకృష్ణుడు
7 ద్రోణుడు
8 కర్ణుఁడు
9 దుర్యోధనుఁడు
10 అశ్వత్థామ
11 వికర్ణుఁడు
12 గాంధారి
13 జమదగ్ని
14 జాబాలి
15 విదురుఁడు
16 కృపాచార్యుఁడు
17 దుశ్శాసనుఁడు
18 సాత్యకి

### 4. వ అంకము

1 శ్రీకృష్ణుఁడు
2 కుంతి
3 కర్ణుఁడు

### 5 వ అంకము

1 పంచపాండవులు
2 శ్రీకృష్ణుఁడు
3 ఉలూకుఁడు
4 రుక్మి
5 పురుషుఁడు
6 సేవారి

### 6. వ అంకము

1 శ్రీకృష్ణుఁడు
2 పంచపాండవులు
3 భీష్ముఁడు
4 ద్రోణుఁడు
5 కర్ణుడు
6 యుయుత్సుడు



శ్రీ మత్పరదేవతాయైనమః

# పాండవోద్యోగము

## నాటకము

[ నాంది ]

శా. ధర్మస్థుం డరిభీముఁ డర్జున యశోధాముండు పాపప్రభా
మర్మచ్ఛిత్తి యమాయమాన నిజనామప్రాభవుం డార్తహృ
చ్ఛర్మోదారుఁడు విశ్వరూపధరుఁ డుష్టచ్ఛ్రీవదాన్యుండు స
త్కర్మాధ్యక్షుఁడు పార్థసారథి యశఃకల్యాణముల్ గూర్చుతన్.

సూత్రధారుఁడు—(నాంద్యంతమునఁ బ్రవేశించి) మారిషా! ఇటురమ్ము.

మారి—(ప్రవేశించి) ఇదిగో! వచ్చితి నేమియాజ్ఞ?

సూత్ర—పాత్రంబుల నన్నిటి నాయత్తపఱచితివి గదా?

మారి—చిత్తము, సర్వము సంసిద్ధముగనేయున్నది. కాని మన పాత్రములయం దొక్కరుఁడుమాత్రము మన ప్రతిపక్షివంచనకు లోబడి మనలన్ ద్యజించి యరిగె.

సూత్ర—(తత్తరపాటుతో) ఎవరతడు?

మారి—అన్యుఁడు కాఁడు, తమ మేనమామయే.

సూత్ర (కోపముతోఁ దనలో) ఓరీ! ప్రతిపక్షి! ఎంతపని చేసితివి?

ఉ. మున్ను సుయోధనుండు నృపముఖ్యుని ధర్మజు భాగినేయుఁ గూ
డ నెన్నటిఁబోవు శల్యునిఁ గడంగి యెటో యొక యుక్తిఁ బన్ని తాఁ

గ్రన్ననఁ దన్నుఁ జేర్చికొనునైవడి నాదగు మేనమామ న
త్యున్నతు నాదరించెను వసించ వచించి హితంబుఁ గొనన్పుచున్.

(రోజించి తలపంకించి) కానిమ్ము నీ కతఁడు సమయము వచ్చినప్పుడంతశ్శల్యాయమానుండై తుట్టతుద కపకృతియే యొనర్చునట్లు నానేర్పుకల్మిని సంఘటించెదఁ గాక. (ప్రకాశము) మారిషా! అతఁడు లేకున్నను మన నాటక ప్రయోగము కొఱఁతపడదు. ఆతని భూమికను ధరింపఁదగువారు మఱికొందఱు గలరు. ఏమైనను అతని వంటివాఁడు సామాన్యముగా మనకు లభించుట దుర్లభము. ఔఁగాక, గతించినదాని కేమి సేయఁగలము? ఏకాలమున కేది యెట్లు జరుగునో యెవరికి దెలియును. సర్వమును కాలమే సంఘటించుచుండును.

మారి— చిత్రము! తాము వచించినట్లు కాలము ప్రతిక్షణమందునను నేదోమార్పు కల్గించుచునే యుండును; చూడుఁడు.

ఉ. భీమధనంజయ ప్రభ లభీనము లయ్యెను, బుష్పపల్లవ
క్షేమముఁ బాసి యుండె సహదేవకుజంబు వనంబులోన; వ్యా
యామభరంబునన్ ద్రుపదజాయత బాష్పపూరంబు నిండె; సం
గ్రామదినంబులుం దరిసె గాలజధర్మము దాఁటలేమిచేన్.

సూత్ర— అవును, నీవు చెప్పిన వన్నియు శరత్కాలజన్యంబు లగు మార్పులు. కాలము సర్వకారణ మని యార్యు లెల్లరును నేక వాక్యతగా నొప్పుకొనిన విషయము.

ఉ. కాలవశంబునం దిరుగుఁ గాదె! దివాకరుఁ డబ్జవైరియున్.
గాలవశంబుచేతనె జగంబు జనించు, రహించు, గ్రుంగు; నీ
కాలమె కల్మిలేములకుఁ గారణ. మెన్నిట నెన్ని చూచినన్
గాలము దాఁటువాఁ డిల నొకండును లేఁడు కుశీలవాగ్రణీ!.

కానిమ్ము; "గతం నశోచామి కృతం స్మరామి" కావునఁ బ్రకృత

మనుసరింపుదము. (యోజించి) నేఁడు నాముహూర్తంబు దుస్స్వప్నము ఏకుఁ బోయినను మనము ప్రయోగింపవలసిన నాటకము పాండవోద్యోగ మని తనవర్తనచే సూచించియున్నాఁడు. కాని యీ నాటకచక్రమును ద్రిప్పఁగలవాఁడు నా బావమఱఁది మురళీదాసు. అతనిని నీవు పోయి వెంటఁబెట్టుకొని రమ్ము. నే నింతలో నీనాటక కర్తలగు తిరుపతివెంకటేశ్వరుల గురువగు శ్రీ చర్ల బ్రహ్మపండితాఖండలుని సంస్మరించి తత్ప్రసాదంబు వడసి వచ్చెదను.

మారి— చిత్తము. (నిష్క్రమించును.)

సూత్ర— (అంజలి ఘటించి)

శా. శాలీపండితుఁడై కృపాళుఁడయి ప్రఖ్యాతిప్రభాపూర్ణుఁడై
యాశీర్వాదముమాత్ర శిష్యులను విద్యావంతులన్ జేయు వా
గ్వైశద్యమ్మునఁ బొల్చుచర్లకులజున్ బ్రహ్మయ్యశాస్త్రిన్ గళా
రాశిన్ శ్రీకడిమెద్దవాసు మది నారాధింతు నశ్రాంతమున్.

(నిష్క్రమించును.)

[ ఇది ప్రస్తావన. ]

[అంత నర్జునుఁడు ప్రవేశించును.]

అర్జు— (తనలో)

చ. ద్రుపదునిపంపునన్ జనెఁ బురోహితుఁ; డాధృతరాష్ట్రిసూని బల్
కపటి వినండు సంధి చెడఁగా గమకించెడిఁగాని, తప్ప దా
లవుఁబని; సర్వమున్ గడపులావు గలండు యశోదపట్టి; యా
రిపుజనకాలుఁ దోడుగ వరించెద సర్వము నిర్వహించెదన్.

(పరిక్రమించి యెదుటఁ జూచి)

మ. అదిగో! ద్వారక; యాలమంద లవిగో! నందండుఁ గోరాడు; న
య్యది యేకోట, యదేయగస్త్ర; యవెరథ్యల్; వారలే యాదవుల్;

యనుసింహాసనము నసింహము మేటి యదిగో! నాలోనవంగకావ్యా
భ్యుదయంబై వరమంచు నంతరంగోచ్చండమై పర్వెడున్.
(ప్రవేశము నటించి యాశ్చర్యముతో) ఏమి! యీవిచిత్రము.

క. మనకన్న మున్ను దుర్యో
ధనుఁ డిట కరుదెంచెఁ గృష్ణుఁ దనవానిఁగఁ గ
న్ననఁ జేసికొని చనన్ దన
మనమందుఁ దలంపఁబోలు మంచుం దకటా!.

వాసుదేవుఁడు పాండవపక్షపాతి! కాదు కాదు. ధర్మపక్షపాతి యని
సుంతైన నిరఁ జెప్పఁగ దు కాలోలు. (నిరూపించి)

మ. అరవిందాక్షుఁడు శేషశాయి జగదీశారాధ్యుఁ డంభోధిజా
వరుఁ డాత్మావనుఁ డంగజాంగజుఁడు శ్రీవత్సాంకుఁడేమో! నిరం
తర నిర్నిద్రుఁడు నిద్రఁ జెందెడిఁ బవల్; తచ్ఛీర్ష పుంబక్కన
క్కురునాథుం డదె కూరుచుండెఁ దళుకుల్ గుల్కంగఁ బీఠమ్మునన్.

[యథోక్తముగా శ్రీకృష్ణ దుర్యోధనులు ప్రవేశింతురు.]

కృష్ణు—(కపటనిద్ర నటించుచుఁ దనలో)

క. రాఁ డాయె నర్జునుఁడు, కురు
రాడవతంసంబు వచ్చె రమ్మని యనికిన్
దోడుగ ననుఁ గోరఁగ మో
మోడంగా వలసివచ్చు నొక్కింత యిటన్.

అర్జు— (భక్తితోఁ దనలో)

మ. జలజాతాసన ముఖ్యదైవత శిరస్సంలగ్నకోటీరసం
స్థల రత్నాని పదాబ్జపీఠి కడు నిగ్గుల్ గూర్చుఁ దత్సన్నిధి
స్థలిఁ గూర్చుండి భవంబు పావనముగా సేవాఋఁ గావించి నా
తొలిజన్మమ్మునఁ గూడుపాపముల నాందోళింపఁగాఁ జేసెదన్.

(కృష్ణుని పాదముల పక్క నిల్చుండును)

దుర్యో— (అర్జునుఁ దేఱిపాఱఁ జూచి తనలో)

ఉ. ఏ నిట కేఁగుదెంచుపని యేర్పడ సర్వము గుర్తెఱింగి రాఁ
గా నితఁ డోపుఁ గృష్ణునకుఁ గవ్వడి కేకశరీర మందు రీ
దానవవైరి వీనియెడఁ దా నవమానము చూపు టెట్లు? నా
పై నెనరూను టెట్లు? కడు బంటుగుఁ డీతని కాతఁ డెమ్మెయిన్.

బంధుత్వమ్మున కేమి! కొంద్ర గొప్ప నాకును నది లేకపోలేదు! లేకపోవుఁగాక నేను ముందుగాఁ దన్ను దర్శింపవచ్చితిని. దానిం బట్టి యీతఁడు నన్నవమానించినచో లోకులు 'పక్షపాతి' యని తన్ను గర్హింతురని సందియ ముండకపోఁడు. కానిమ్ము సకలమ్మును నిప్పుడె తేలఁగలదు.

కృష్ణు— (తనలో)

క. నాయనుఁగుంజెలి నాదగు
కాయము నాజీవగఱ్ఱ కవ్వడి నన్నున్
సాయమ్ము గోర వచ్చెన్
నాయంతస్తాప ముడిగె నను ముద మొనసెన్.

నిదురమత్తు నటించుచు నర్జునాభిముఖముగా లేచి కౌఁగిలించుకొని (ప్రీతితో)

ఉ. ఎక్కడనుండి రాక యిట? కల్లరునున్ సుఖులే కదా! యశో
భాక్కులు నీదునన్నలును భవ్యమనస్కులు నీదుతమ్ములున్
జక్కఁగ నున్నవారె? భుజశాలి వృకోదరుఁ డగ్రజాజ్ఞకున్
దక్కక నిల్చి శాంతుగతిఁ దాను జరించునె తెల్పు మర్జునా?

(ప్రక్కకుఁ దిరిగి దుర్యోధనుం గాంచి గౌరవముతో)

శా. బావా! యెప్పుడు వచ్చితీవు? సుఖులే భ్రాతల్సుతు ల్భృత్యముల్?
నీవాల్లభ్యముపట్టు కర్ణుఁడును మన్నీలున్ సుఖోపేతులే?
మీవంశోన్నతిఁ గోరుభీష్ముఁడును మీ మేల్గోరు ద్రోణాదిభూ
దేవుల్ నేమముస్థా నెసంగుదురె? నీ తేజంబు హెచ్చించుచున్.

క. నీవచ్చినపని దెల్పుము
దావహుఁడవు గమ్ము నాకు; నఖిలావనిపా
లావనిమౌళిమణీసం
భావితచరణుఁడవు నీవు వచ్చుట యసదే.

దుర్యో— (తనలో) ఇతఁ డజ్ఞుని సంభావించురీతి యొకవిధముగను నన్ను గౌరవించు నైఖరి మఱియొకతెఱంగునను గన్పట్టుచున్నది. కానిమ్ము, లోకాచారము గాన నేను వచ్చినపనిం దెల్పెదను. (ప్రకాశముగ) నేను వచ్చి చాలసేపైనది.

ఉ. కౌరవపాండవుల్ పెనఁగుకాలము చేరువ యయ్యె; మాకు న
వ్వారికిఁ గూడ నెక్కుఁడగు బంధుసముద్రుఁడ వీవు గాన, నీ
చేరిక మాకు నిర్వురకు సేమము గూర్చెడిదౌట, సాయమున్
గోరఁగ నేగుదెంచితిమి గోపకులైకశిరోవిభూషణా!

క. ఇరువురకు సముఁడ వగుని
న్నరసితి నేఁ బ్రథమమునం దటుగానన్
సరసిజలోచన! నాకున్
గర మనుకూలుఁడవు గమ్ము కయ్యమ్మునెడన్.

కృష్ణు— కురుకంఠీరవా! నీవు చెప్పిన దిమిగుల యుక్తియుక్తముగా నున్నది. సర్వవిధముల మీకిరువురకు నేను సాయము చేయఁదగువాఁడనే. ఇఁక ముందు వెనుకలం గూర్చి విచారింపుదము.

ఉ. ముందుగ వచ్చితీవు మునుముందుగ నర్జును నేను జూచితిన్
బందుగు లన్నయంశ మది పాయక నిల్చె సహాయ మిర్వురున్
జెందుట పాడి; మీకు సయి చేసెద సైన్యవిభాగ; మందు మీ
కుం దగుదానిఁ గైకొనుఁడు; కోరుట బాలుని కొప్పు మున్నుగన్

దుర్యో— (తనలో) ఇతఁ డేదో కుయుక్తి పన్నినను గొంత సాయము చేయక తీరినది కాదు. కానిమ్ము, నా కంతే చాలును.

ఉ. నాకు గదా గురుండు భువనస్తవనీయ పరాక్రముండు సు
శ్లోకుఁ డమాయకుండు రిపులోకభయంకరుఁ డస్మదర్థసం
ధాకుశలుం డుదారగుణధాముఁడు శ్రీబలరామదేవుఁ డీ
పోకలవాఁడు గాఁడు వృథ పుచ్చఁడు మెచ్చ డతండు పాపులన్.
(ప్రకాశముగా) వాసుదేవా! నీయిచ్చవచ్చినట్లే కానిమ్ము.

కృష్ణు— ధనంజయా! నీయభిప్రాయ మేమి?

అర్జు— సకలధర్మస్వరూపుఁడ వగునీ కొరులు చెప్పవలసిన దేముండును?

దుర్యో— (నవ్వి) బావా! నీయావచ్చ క్రీని బాటువడి యర్జునున కిందు భాగము గల్పించుటయే కాక కోరుకొనుటలోఁ గూడ మొదల నతనికే యవకాశ మిచ్చియు "నీయభిప్రాయమే"మని యడుగు చున్నావు. ఇంతకంటె నెవరియభిప్రాయ మైన నెట్లుండెడిని?

కృష్ణు— సుయోధనా! అట్లు కాదు.

క. నీవు స్వతంత్రుఁడ వీతఁడు
సేవకుఁ డగ్రజుని చెప్పుచేతలకుఁ లో
నై వర్తించెడి; నందుల
కై వేఱుగ నడుగ వలసె నది యట్లుండెన్.

ఇప్పు డీతని నడుగకయే మనకు దోఁచినట్లు భాగము లేర్పఱచి కోరు కొమ్మన నేదోయొకవిధమునఁ దనకుం గోలుతెలుంగునఁ గైకొని చనినపిమ్మట నయ్యది ధర్మజునికి నచ్చనియెడల "వాసుదేవుండు బంధుగుఁ డయ్యును మమ్మును వంచించె"నని యనవచ్చును. అట్టి యెడ "మువ్వాంటికిని నీతమ్మునికిఁ జెప్పియే చేసితి"మని ప్రత్యు త్తర మిచ్చుట కవకాశ ముంచుకొనుటకై యిట్లు చేయవలసి వచ్చి నది. ఇది యిట్లుండుఁగాక, ప్రకృతము విచారించుకొందము.

తే. గీ. అన్నియెడలను నాకుఁ దీటైనవారు
గోపకులు పదివేవు రఖండబలులు

గలరు నారాయణాఖ్యఁ జెన్నలరువారు;
వారలొకవైపు నే నొక్కవైపు మఱియు.

క. యుద్ధ మొనరింత్రు వారల
బద్ధమ్మందులకు? నేను బరమాప్తుఁడనై
యుద్ధమ్ము త్రోవఁ బోవక
బుద్ధికిఁ దోఁచిన సహాయమును గావింతున్.

దుర్యో— (తనలో) ఔరా! కృష్ణుఁ డెంత మోసము చేయుచున్నాఁడు? సేననంతయు నర్జునున కీయదలఁచి యీ పన్నిక పన్నినాఁడు. ఎంత వెఱ్ఱివాఁడైనను నిప్పుడు దన్ను గోరుకొనునా?

క. ఆయుధము పట్టఁడఁట! యని
సేయఁడఁట! "కంచిగరుడసేవ" యితనిచే
నేయుపకృతి యుద్ధార్థికి
నేమొన నగు! నిట్టివాని నెవ్వండు గొనున్.

(యోజించి) అయినను బరమాప్తుఁడగు శ్రీకృష్ణుని విడిచి యర్జునుం డితరము నపేక్షించునా? (తలపంకించి) అపేక్షించనియెడలఁ గృష్ణుని కపటోపాయమ్ము నాకే యుపయోగించుఁగాక!

అర్జు— బావా! కోరుకొనవచ్చునుగాదు?

కృష్ణు— కోరికొనవచ్చును. నేను జెప్పినమాటలు తుట్టతుదవఱకు వింటివికావు! ఇదిగో మరలఁ జెప్పుచున్నాఁడను.

ఉ. ఆయుధముం ధరింప నని కగ్గముగా నొకపట్ల నూరకే
సాయము సేయువాఁడఁ, గెలుచ న్ననుఁ బిమ్మట నెగ్గు లాడినన్
దోయిలి యొగ్గుదున్; నిజము తోడ్తవచించితిఁ గోరికొమ్ము నీ
కేయది యిష్టమో; కడమ యీతనిపా లగుఁ బాండునందనా!

దుర్యో— (తనలో)

క. ఇట్టి దొకటి లేకుండిన
దట్టుఁ డితఁడు "నట్టిగొడ్డుతాక" ట్టిపుడీ

పట్టంగాఁ జేసి నాకిక
పెట్టుగ దప్పింపు మనుచు వేల్లను నన్నున్.

అర్జు—ఇదిగో కోరుకొనుచున్నాఁడను.

ఉ. నందకుమార! యుద్ధమున నారథమందు వసింపుమయ్య! మ
ధ్యందిన భానుమండలవిధంబున నీదగుకల్మిఁ జేసి నా
స్యందన మొప్పుఁగాక! రిపుసంతతి తేజము దప్పుఁగాక! నీ
వెందును నాయుధమ్ము ధరి కేగమి కొప్పుచుఁగాక కేశవా!.

దుర్యో— (సంతోషముతోఁ దనలో) సర్వవిధములఁ గృష్ణునికపటోపాయము మనకే యుపకరించినది.

తే. గీ. రథమునం దున్న చిత్రింపుఁ బ్రతిమ లుండు
వందు శివుఁడును విష్ణువు నజుఁడు నెల్ల
దేవతలు నుండవచ్చు; నాకీవిఁ గృష్ణుఁ
డున్న స్యందన విభూష యగునుగాక!.

(ప్రకాశము) బావా! పరిశేషన్యాయమునఁ దక్కినదానినే యేను గైకొంటిని. ఇఁక నే నరుగుదునా?

కృష్ణ— మంచిది పోయిరమ్ము.

దుర్యో— (నిష్క్రమించును.)

కృష్ణ— (అర్జునుని వీపుపైఁ జఱచి చిఱునవ్వుతో) బావా! ధనంజయ!

ఉ. "ఆలము సేయ నే" నని యథార్థము బల్కితిఁ జుమ్మి యిట్టి గో
పాలుని నన్నుఁ గోరితివి! భండనపండితు లగ్నితేజు లు
త్తాలధనుర్ధరుల్ బహుశతప్రమితుల్ యదుసింహు లందఱిన్
బాలుగఁ గైకొనెన్ గురున్నపాలుఁడు బాలుఁడనైతి వక్కటా!

అర్జు— (ఆనందముతో) బావా! నీయుద్ధ మేరికిఁ గావలయు? నీవు నాయండ నుండుటయే పదివేలు.

ఉ. "ఉన్నది పుష్టి మానవులకో యనుభూమిప! యోగజాతికిన్
దిన్నది పుష్టి" నీ వరుగుదెంచి రథంబున నున్నఁ జాలు నే
సున్నముఁ జేసెదన్ రిపులఁ జూపఱు లద్భుత మంద; సర్వలో
కోన్నత! నాకుఁ దోడసఁగు మూరక చూచుచునుండు మచ్యుతా!.

క. నీతూష్ణీంభావము ప్ర
ఖ్యాతిగ మా కొసఁగు. నీవ యని చేసినచో
శీతాంశునకుం దిక్కుల
భాతిన్ భాస్కరునకుఁ బేరు బయ లెక్కు నెటుల్?.

క. పదివేల లెక్కయే యొక
పదికోటులు వీరు లున్న భర మగా నీ కే
మెదు రైతి మేని జయమున
నిదియోగ్యమె కోరితిని జుమీ నిను దేవా!.

క. గోపాలుఁ డనిసఁ దక్కువె
గోపాలుఁడవే నిజంబు గోపాలక! నీ
గోపాలకత్వ మొసగున్
గోపాలకతాభరంబు గొబ్బున మాకున్.

కృష్ణు— (ప్రసన్నభావముతో) ధనంజయా! నీకు నాయందుఁ గల భక్తికిం గడు సంతసించితిని.

ఉ. ఊరక చూచుచుండు మను టొప్పితిఁ గాని భవద్రథస్థుఁ డ
బ్బాలుఁగఁ జూచి నీరిపులు పక్కున నవ్వ యనాదరింతు రా
శూరకులంబు మెచ్చ రిపుసూదనతాభర మూను నీకు నే
సారథినై యిఁకన్ విజయసారథినామము నర్థిఁ జరించెదన్.

అర్జు— (పట్టరానిసంతోషముతో) దేవా! లీలామానుషవిగ్రహా! నేను చిరకాలమునుండి యేది మనంబున నభిలషించితినో అయ్యదియే నీవు ప్రసాదించితివి.

క. బాగుగఁ నంక కీక నోయను
నందన! భక్తుండ నట్టి నన్నెటులైనన్
ముందఱికిఁ దెచ్చుభారమ
వం! దేవర దెవఁడు సుకృతి నాకన్న నికన్.

పూర్ణముగా ననుగ్రహింపఁబడితిని.

ఉ. సారథి యంట! వేదములసారము గాదె; తదంఘ్రిభక్తిచే
న్నారెదు క్రీడి తా రథికుఁ డౌనఁట! చిందము విల్లుఁ దేరునున్
వారువముల్ మొదల్ దివిజవర్గ మొసంగినవంట! యస్త్ర వి
స్తారగురుల్ శివాదులట, సంగరమం దెవఁ డాగఁజాలెడిన్.

బావా! అన్న నీ రాకకై వేచియుండును గావున నుపప్లావ్యంబున కరుగుదము రమ్ము.

కృష్ణ— మంచిది పోవుదము. అర్జునా! మీరాసుయోధను డిప్పు డెక్కడి కరిగెనో యెఱుఁగుదువా?

అర్జు— బలదేవుని సందర్శనమున కని తలఁచెదను.

కృష్ణ— నీవనినట్లు! నీవుమాత్రము మాయన్నను సందర్శించి సహాయమేల కోరవు?

అర్జు— నామనంబునఁ గలయథార్థము వచించెద నాలింపుము.

ఉ. ఈ నాకరుండవే జగములెల్ల జయించెద; వేనుఁగూడ న
ల్లే విలయుం బొనర్పఁగల; నెందును బేర్గలవాఁడ వౌట ని
క్కీ విజయుప్రశస్తి యగు నేమొ యటంచు మదిన్ దపింతు స
ద్భావముకల్మి నాయభిమతం బొడఁగూర్చితి, కొండ నెక్కితిన్.

మ. బలరాముండు బలాభిరాముఁ డతనిన్ ప్రార్థించినన్ వచ్చుఁబో
కలన న్నీవలె నుండు గొప్పఁ దనఁ దక్కుం గౌరవం బెల్లయో
ధులఁ జక్కాడు మృగావళిన్ బలె; యశోదుర్గాధి నింకొక్క ప్రో
ల్లేలయించున్ దనపేర; నాకు జగతిన్ జే రెట్లు పెంపారెడిన్!

కృష్ణు— (నవ్వి) నంగనాగా! అతఁడు మన కౌమారపుఁబ్రమున నిర్బంధించినచో నప్పుడు మాత్రము సంగరంబు న్యాయము కాదా?

అర్జు— అనుఁగారా! నీయనుగ్రహ మున్నచో నేలోపమును రాదు.

కృష్ణు— (నవ్వి) నీ ధైర్యమునకు సంతసించితిని. ఇఁక నిజము వచించెద వినుము.

ఉ. వచ్చెడివాఁడు గాఁ డతఁడు వానికి మీకును గూడఁ దోడు. వి
వ్వచ్చుఁడ! యుష్మహామహనీయ ప్రభావము మున్నె యోజించినాఁడ; నా
సచ్చరితుండు మీకుఁ దగ సంధి పొసంగిన సంతసించు, నా
యిచ్ఛయు నట్టిదే! మనకౌరవునిచ్ఛయుఁ గూడ నిట్టిదే.

కావున మన మిఁక సంధులకై యత్నింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁ
బడిన పాండవోద్యోగమునందుఁ
బ్రథమాంకము.



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవోద్యోగము

## నాటకము

### ద్వితీయాంకము

[పిదపఁ బాండవు లైదుగురును ద్రౌపదియుఁ గృష్ణుఁడును ప్రవేశించుచున్నారు.]

కృష్ణు— దేవా! అజాతశత్రూ! యుధిష్ఠిర!

క. నాతరము గాక యున్నను
చేతులు జోడించుకొనుచుఁ జేసెద దాసి
న్నీతలఁపుఁ దెలుపు మఖిల ధ
రాతలపతిమౌళిరత్నరంజితచరణా!.

ధర్మ— దేవా! వసుదేవనందన! నీ యొనర్చు సంబోధనము భావికార్యసూచకమేమో గాని వానప్రస్థుఁడ నగు నే నిప్పటి కందులకుఁ దగను.

ఉ. "తమ్ముని బిడ్డ లంచు మదిఁ దల్పఁడు పుత్రులలోనఁ గూడె రా
జ్యమ్మున మీకుఁ బాలొసఁగఁ డంధనృపాలుఁ" డటంచు మున్ను నీ
సమ్ముఖమందె తెల్పెఁగద! సంజయుఁ; డా కురురాజు లుబ్ధచి
త్తమ్మునఁ గన్నుఁగానఁ డికఁ దప్పదు యుద్ధము బంధునాశమున్.

జయపరాజయంబులు దైవాధీనంబు లనియు నా దైవంబ వగు నీవు నా మొదలఁ గలవనియు నెఱుఁగుదును అయినను,

ఉ. ఆలును బిడ్డ లేడ్వ స్వకు లాలములోఁ గడతేఱ గల్లచు
ట్టాలును రూపుమాయ నకటా! యిది దక్కెనె! దక్కనిత్తురే?
చాలును రాజ్యభాగము; ప్రజల్ సుఖయించిన నాకుఁ జాలుఁ; నే
జాలక కాదు చూవె! తినఁజాలను నెత్తురుకూడు మాధవా!.

కృష్ణు— బావా! యీయసమయనిర్వేద మేల? క్షత్రియకుమారులకు నెత్తురుకూడు గాక జోలికూడు తినుట ధర్మమా? అయినను నీయభిమతం బేదియో నిర్వర్తించుటయే మాకుఁ బరమధర్మము కావున స్పష్టముగఁ దెలుపుము.

ద్రౌప— తెలుప వలసిన దేమున్నది? మొన్న సంజయుఁడు "మీరు వారు యుద్ధము చేయనిచో రాజ్య మీయరనియు నీవు యుద్ధముచేసి రాజ్యము కోరుటకన్న నంధకరాజ్యమందో వృష్ణిరాజ్యమందో బిచ్చ మెత్తుకొని జీవించుట కొంత యుక్తమనియు బోధించెనుగదా! అట్లు బిచ్చమెత్తుకొనుచు మధ్య మధ్య వనంబులకరిగి వెనుకటివలెనే కందమూలంబులారగించుచు ఋషులతో ధర్మశాస్త్రంబులు ముచ్చటించుకొనుచు నుండవలసినదనియే మీ బావగారి యభిప్రాయము.

కృష్ణు— అమ్మా! ద్రుపదరాజపుత్రీ! చెప్పవలసినదంతయుఁ జెప్పనిమ్ము. (యుధిష్ఠిరునకు) దేవా! యుధిష్ఠిరమహారాజ!

ఉ. సంజయు రాయబారమున సార మెఱింగితి మాటఁ డెంకు మీ
కుంజను శాంతి, వారలకుఁ గోపము యొప్పెడి; మీకు బిచ్చపుఁ
గంజి రుచించు, వారలకుఁ గమ్మనిపాలు రుచించు; మీకు నై
వింజము పుట్టె, వారికయి పృథ్వి జనించె నటంచుఁ దెల్పెడిన్.

ఔరా! యేమి యీశుష్కప్రియములును శూన్యహస్తములును!

క. మా కాయుష్యము మఱియుఁ
మా కారోగ్యంబు మఱియు మాకు ధనంబుఁ
మీకు ఋణ మన్న తెఱఁగున
కీ కౌరవనాథుసంధి దృష్టాంత మగున్.

క. పాలీకున్నను దమకం
దాలోఁబడి తినుటకేని దయసేయుఁడ భూ
పాలుఁడు ధృతరాష్ట్రుఁడు స
చ్ఛీలుఁడు దాతనికి నెవరు చెప్పెడివారల్.

ఈసంధి సర్వవిధముల "నీనోట నేను వ్రేలిడెదను నానోట నీవు వ్రేలిడు" మన్నట్లున్నది. ఇది యెట్లున్నను నీమనంబు యుద్ధమునకు వెనుదీయుచున్నది. అగుంగాక! నీనిశ్చయము వ్యక్తీకరింపుము.

ధర్మ — నీ నుడివిన దంతయు నిక్కమే, అయినను పితామహ కుంభసంభవ కృపాచార్యప్రముఖులు పనుచుండఁ బేరోలగమునఁ బుత్రశతపరివృతుండగు మా పెదతండ్రితో నీవుఁగూడ నొక్కసారి సంధివచనంబులు విన్నవించిన వినునేమో యని తలచెదను. కావున నన్ను మన్నింపుము.

ఉ. ఇంతకు సంధిమాట విననీ పిసకంత గని మనంబు ని
శ్చింత మగున్, జనంబు మన సేనుమె కోరుదు రెల్లవారు, నిం
దింతురు వారి నిశ్చయము, నిన్ను నుతింతురు, మాకుఁ గీర్తి; సా
మంతనృపాలు రందఱకు మావ్యవసాయము తేటతెల్లమా,
కాన మదీయమాపన్నము నము నాఁటింప కర్ణధారుఁడవు కమ్ము.

ఉ. సంధి యొనర్చి మాభరతసంతతి నిల్పుము, లేద యేని గ
ర్వాంధుల ధార్తరాష్ట్రుల సహాయులతోఁ దునిపింపు మోజగ
ద్బాంధవ! రెండు కర్జములభారముఁ బెట్టితి మయ్య! నీభుజ
స్కంధమునందుఁ; దారసిలుఁగావుత నాకు యశంబొ రాజ్యమో.

సకలధర్మస్వరూపుండవును సమస్తశాస్త్రవిశారదుఁడవు నగునీకు మా యుపదేశం బనావశ్యకము. అయిన నొక్కవిశేషంబు వినుము.

గీ. సౌబలేయులు సంధి కిష్టపడరేని
అన్నదమ్ముల మేము నూటైదుగురము
పాడిమెయి నిష్టపడరేని వారు నూటు
గురె సహోదరు; లే మైదుగురమె కృష్ణ!.

కృష్ణ— అట్లుజరుగుటయే దుర్లభముగాని జరిగిన మంచిదియే కదా.

ఉ. మీరును మీరు! గీడ్వడుట మేలగు నే ప్రజకైనఁ గాని దు
ర్వారులు ధార్తరాష్ట్రులు భవాదృశు లౌదురె ధర్మరాజ? నీ
కోరికఁ జేయఁగూడ దనఁగూడదు గావునఁ బోవువాఁడ; నీ
కూరిమి నోరిమిన్ ప్రజలకున్ హితం బొనరింతు నచ్చటన్.

ధర్మ— (ఆలోచించి) పాపాత్ములగు సుయోధనాదులకడకు నిన్నువంటి వారిం బనుచుట యుపాయకరం బనియు దలంచెదను. త్రిలోకాధిపత్యంబైనను పాండవులకు నీకీసుమంటిది గాదు గదా!

కృష్ణ— (నవ్వుచు) బావా! అట్లెన్నఁడును సందేహింపకుము.

క. ఉక్కివు లగుకౌరవులుం
దక్కిన భూవరులు గలిగినను బార్థివ! నా
ప్రక్కకు రానేర్తురె! యొక
లెక్కయె నిక్కముగ నే నలిగినం జెపుమా?

గీ. న్యాయమార్గంబు వినని కర్ణత్రయుంబు
గలుగువాఁడు గదా! యట్టిఖలుని యెడల
సంధి కురురాజ యను నొక్కసందియంబె
కాని మనమున నా కొండు గలదె వెఱపు!

ధర్మ— నీ కొక్కరివలన వెఱపు లేదనుట సత్యమే. అయినను,

ఉ. దౌత్యముపట్ల నీవు దెసఁ దప్పుపనుల్ పచరించు కౌరవ
వ్రాత్యుల రూపుమాపుదని పట్టినఁ బట్టఁగవచ్చుఁ గాన మీ
సాత్యకి వెంటఁబెట్టుకొని చన్మ చటుల్ గృతవర్మ కౌరవా
మాత్యుఁడెయయ్యుయాదవుఁడు మాధవ! నీకనుకూలుఁడయ్యెడున్

భీమ— (కనుసైగఁజేయుచు) ఇంతకు సంధి యేమని?

ద్రౌ— (ఎకసక్కెముగా) ఐదూళ్ళిచ్చినఁ జాలు నని యుఁట!

భీమ— (తనలో) అహా! కాలవైపరీత్యము.

చ. అనుపమవిక్రమక్రమసహాయులు కౌరవులీ ప్రపంచరాజనం
దనులకు నొక్కకూళ భరణం బిడుచాడ్పున నోళ్లు లేదు సి
చ్చునటె! కటా! యిటు బ్రదుకం జూచుట రాచకొలంబువారికిం
ఘనతయె? మంత్రరుద్ధభుజగంబ నిసీ! యిపు డేమిచేయుదున్.

(దుర్యోధనాదుల నెదుట నున్నవారిఁగ భావించుకొనుచుఁ బ్రకాశము)
ఓరీ! దుర్యోధన దుశ్శాసనపాతకులార!

ఉ. అగ్రజుఁ డంపుఁగాక! నరకాసురమారకుఁ డేగుఁగాక! మీ
రుగ్రత మాని సంధి పడ నందురుగాక! యిదంభుజార్గళో
దగ్రగదాప్రహారములఁ దప్పదు మృత్యువు మీకు నమ్ముఁడీ
యగ్రజు సంధికి న్నృపతు లంగరిచానమిదో ఫలం బగుఁగా.

ద్రౌప— ఏమీ! దుర్మార్గులగు కౌరవు [illegible] తలపట్టి యీడ్చి
కట్టుపుట్టంబు లొలువఁ జూచుచుండియు నన్ను దిక్కుమాలినదానిఁ
గాఁ జేసిన పార్థమధ్యమున నీయసహాయకోపము! ఔను! అసమర్థుల
కెందును బరోక్షమునఁ గదా ప్రగల్భోక్తులు మెండు.

భీము— (ఎదుటఁ జూచి) ఏమీ యిచ్చట వారు లేరా? కోపాంధకారమునఁ
గానక యిట్లంటిని ద్రుపదరాజపుత్త్రీ! నిజము. అసమర్థులమే కాదేని,

మ. ఒకదుర్మార్గుఁడు కొప్పువట్టికొని సర్వోర్వీపతుల్ చూడఁ గొం
కక నీకట్టినపుట్ట మార్యసభ లాగం జూడమే! దాని కూ
రక యున్నట్టికతంబ యస్మదసమర్థత్వంబు వ్యక్తమ్మవ్వఁగా
సకి! యింకేటికి మమ్ము మాటాడవు వాచాశూరు లింపొందవుల్

ధర్మ— క్షత్రియదంపతులారా! శాంతింపుఁడు శాంతింపుఁడు! భవి
తవ్యమెన్నఁడును గాకపోదు.

భీము— శాంతించి చిరకాల మైనది. (గద నేలంబడవైచుచున్నాఁడు)

కృష్ణు— ఆర్య! ధర్మతనూజ! సంజయునిమాటలు వింటిని. నీనిశ్చయం
బును వ్యక్తపఱచితివి. ఇంకఁ బయనమై హాస్తినాపురంబునకుం
బోయి నీయభిమతం బీడేర్పఁ బ్రయత్నించెదను. కాని—

గీ. మోసకులు కౌరవులు నీతిమాలు లనుచుఁ
జెలిమి ఘటియిల్లుటయు ననిశ్చయ మనుచుఁ
దెలిసియుఁ గూడియు గాంచి కలత వడియె
బురదలోఁ బడ్డయేనుఁగుఁ బోలె నగిప !

ఉ. మాయదురోదరంబున నమాయికుని న్నిను గెల్చి కాంతకుం
జేయఁగరానియంతపనిఁ జేసి యరణ్యములోని కంపియున్
హాయిగ నుండనీక ఖలులై పలుకష్టము పన్నుచున్న యా
దాయలు చత్తు రంచు దయఁ దాల్చెద వెంతటి ధర్మరాజవో?

విక్రమరహితు లగురాజుల కాపదలు మెండనియు నిడుములుపడువాని కదృష్టము మారదనియు నదృష్టహీనునకు భాగ్యంబుచేకూరదనియు వచించుపెద్దల నీతివాక్యములు స్మృతికిం దెచ్చుకొనుము.

గీ. శత్రుపక్షంబు నిరసించి సంగరంబు
సేయ మదిఁ గొన్న మయ్య! నిశ్చింత మీఱ
నేనుఁ గూలఁ జంపి జీవింపఁబోనుఁ గాని
నీరసంపడ దెప్పుడు కౌరవంబు.

గీ. మానహానికి సమ్మతింపరు మహాత్ము
లసువు లైనను విడుమట యనుమతింత్రు
బూడె ముంగాలఁ దన్నుచుఁ బోవుఁగాని
మంటదరి కేగఁ జూచునే మనుజగణము?

ధర్మ— శాత్రవులు మిక్కిలి బలసంపన్నులు. మనమా! యంతటిబలసహాయము లేనివారము. జయం బెదిరికో మనకో తెలియుట దుర్లభము; దానంజేసి సుఖము సంశయకల్పితము. అని తలంచి నిశ్చితసుఖప బగు సంధి సేయుటయే మనకుఁ గర్గంబు.

కృష్ణ— యుధిష్ఠిరా! నీ బలపరాక్రమము లును నీతమ్ముల తేజంబును నీ వెఱుఁగక మాటలాడుచున్నావు.

ఉ. నాల్గుపయోధులో యనఁగ నాలుగుదిక్కరులో యనంగ నీ
నల్గురుతమ్ములుం బ్రమథనాథసమానులు; యుద్ధరంగమం
దల్గిన నెవ్వఁ డోపఁగల డయ్య! భవత్పరిభావవహ్నికిం
గల్గిన వృద్ధిఁ గాంక రిపుకాంతల బొప్పము లార్పఁ జూడుమా !!

ఇదియు భవితవ్యమునకుం దగిన యుపదేశము గాని నీతలంపున కన్యథాకరణంబు కాదు.

ఉ. ఐనను బోయి రావలయు హాస్తిన; కచ్చటి సంధిమాట యె
ట్లైనను శత్రురాజుల బలాబలసంపద చూడవచ్చు నీ
మానసమందుఁ గల్గు ననుమానముఁ దీర్పఁగవచ్చుఁ దత్సమా
ధానము మీవిధానమును తాతయు నొజ్జయు వింద రెల్లరున్.

భీము—(బిగ్గరగా) ఓయీ! కురుపాండవసంధివిధానధౌరేయ! పాండవ మూతా! జనార్దనా! మారాజుగారి తలఁపు వేఱు నీతలఁపు వేఱుగ నున్నది.

ఉ. యుద్ధము యుద్ధ మంచు మది యుబ్బఁగనీకుము మానివై యసం
బద్ధము లైనవాక్యములు పల్కకు మం దెవ రెట్లు లాడినన్
క్రుద్ధుఁడ నౌచు సంధిఁ జెడఁగొట్టక ధర్మతనూజు కార్యసం
సిద్ధి యొనర్చు మయ్యనఘ సేమమె మాకును సేమ మన్నిటన్.

ప్రకృతిసంగళితుండును నాజన్మపాండవద్వేషియు నైశ్వర్యమదమత్తుండును క్రూరసహాయుండును దురుద్యోగియు మానియు నగు సుయోధనుండు చచ్చుటకైనఁ దెగుఁ గాని తనమతంబు వదలఁడు. వాని నైజంబు నీ వెఱుఁగనిది కాదు.

సీ. ఒక్కొకకులంబు నశియింప నొక్కఁడొకఁడు
పుట్టు వొందిరి పూర్వ మపూర్వనృపులు
ఖలులు నేఁటికి గాంధారి కడుపునందు
జనన మందిరి భరతవంశంబుఁ గాల్ప.

కానఁ జరుగుపాయములు గొన్ని నశింప నదునోపాయంబులు వానిఁ
జక్కఁబఱుపుము.

కృష్ణు— (నవ్వి) ఇది భీమసేనుని మాటలేనా! (సమీపించి చేతితోఁ
జఱచుచు)

గీ. నిదుర వోవుచుంటివో! లేక బెదరి పల్కు-
చుంటివో? కాక, నీవు తొల్లింటి భీమ
సేనుఁడవె కావె! యెన్నఁడే చెవులు వినని
కనులు చూడని శాంతంబు గానవచ్చె.

చ. "కురుపతి పెందొడల్ విరుగఁ గొట్టెద రొమ్ము పగిల్చి వెచ్చని
త్తురు కడుపారఁ గ్రోలి యసిఁ దున్మెద దుష్టుని దుస్ససేను భీ
కరగదచేత" నంచును బ్రతిజ్ఞము లాడితి వల్లకొల్వులో
మరల నిదేల యీపిరికిమానిసిపల్కులు మృష్టభోజనా !.

ద్రౌప— భగినీవత్సలా! నూఱుమాటలాడవచ్చును గాని యొకమాట
నెఱవేర్చుట దుర్లభము కదా!

కృష్ణు— ఔను! మానవతీశిరోమణీ!

గీ. బరువు మోయఁగలేని దుర్బలుఁడు సమయ
మరసి యేకాంత మగుచోటి కరుగుపగిది
నేఁటిదాఁకఁ బ్రగల్భపుమాటలాడి
తెమరుచున్నాఁడు పోరికి భీముఁ డిపుడు.

ధర్మ— (తనలో) ఎట్టకేలకు చల్లాఱిన భీమకోపాగ్ని నీమహానుభావుండు
రగులుకొల్పుచున్నాఁడు కాన నిటు చేయఁ గూడదని యుండలించె
దను. (జనాంతికముగా) వాసుదేవా! మహానుభావా!

చ. పగ దిగనాడి నావలనిభక్తితంబునఁ గాళ్ళసంకెలల్
దగులుప లోపల న్వగచుచుఁ దంతివిధంబున నున్నవానితో
జగడము తెచ్చిపెట్టుకొని శౌర్యముఁ బోరికి నాయతంబు సే
యుఁగ నిఁక నున్నదే! మనప్రయత్నము లన్నియు సాగనేర్చునే?

కృష్ణు— ఈ భీమునకుఁ గోప మలంకారమగునట్లు శాంతము కానేరదు. కావునం గోపమునచ్చుటకయి యీ ప్రశంస తెచ్చితిని గాని యథార్థముగాదు.

ద్రౌప— (జనాంతికముగా) అన్నా! దీనశరణ్యా! పాంచాలీ పరిభవక్లేశ మనుభవించుటకుఁ జాలుపడుకొను సార్వభౌము వృకోదరుని కోపాగ్నియే చల్లార్చిన ద్రౌపది యొక దిక్కులేనిది సుమీ.

భీము— (ఏకపక్షముగ) [illegible] సంభూషితాంగ ధౌరేయా! పాండవదూతా! యదునందనా! ఏమంటివి! "బెదరుచున్నాఁడు పోరికై భీముఁడిపుడు" అనియా? అవును పుట్టువుచేతనే శూర కులభూషణంబవు నీవు నన్ననవలసినదే.

ఉ. పసితనమందఁ పాలొసఁగ వచ్చినదానిని జంపినాఁడనో!
పసరముతోడఁ బోరి బలవంతులలో పలఁ గీర్తిఁ గొంటినో!
ముసలిది మేని చీలికలు మూసిన మానిసి కోడిపోతినో!
మసలితినో! సదా పసులమాటున శౌర్యము నాకుఁ గల్గనే.

కృష్ణు— (తనలో) ఇదిగో! భీమమనశ్చతుష్పథంబునం గ్రోధసర్ప క్రోధంబు మోసులెత్తుచున్నది. సమయానుకూల వచన రచనా దోహదంబున నప్రతిహతమై దెస లాక్రమించునట్లు కావించెద. (ప్రకాశము) బావా! భీమసేన! ఉన్నమాటన్న నీకింత యలుకేల? బీరము లాడియాడి సమయమునకు సంధికిం బురికొల్పుచు గద దూరముగాఁ బాఱవైచి కూర్చుంటివి కాన నట్లంటి.

భీము— ఓయీ! పరాభిప్రాయానభిజ్ఞా! యుద్ధమునకే బెదరితినో! యన్నగారి యానతికే బెదరితినో తెలిసికొనలేకపోతివి.

ఉ. అంబుధు లింకుఁగాక ప్రళయాంతము వచ్చిన వచ్చుఁగాక లో
కంబులు సూర్యచంద్రు లడఁగం దల్క్రిందగుఁగాక గొప్పక

ష్టంబులు మూఁడుఁగాక పెనుసంపద పెంపఱుఁ గాక యెట్టి కృత్యంబుల నెందునే నడుగుదాఁటరు పాండవు లన్న మాటకున్.

కృష్ణు— బావా! సుయోధనుఁ తొడలు విఱుగఁ గొట్టి చంపెద ననియు దుస్ససేనుని ఱొమ్ముఁజీల్చి నెత్తురుఁ ద్రాగెద ననియు నీవన్నమాటలు గావా!

భీము— (బింకముతో) అవును నేనన్న మాటలే.

కృష్ణు— (చిఱునవ్వుతో) ఐనచో భీముఁడు దక్కఁదక్కిన పాండవులే యన్నమాట కడుగు దాఁటనివారు

భీము— (ఎక్కసక్కెముగ) ఓయీ! అన్నమాట కనఁగా నీకర్థమే తెలియకపోయె.

గీ. గొల్లపల్లెలఁ జెడ వంచించి కొంపకొంప
కరిగి పాల్వెన్న పెరుఁగు దొంగతికమునన
బొట్టనిండించి జీవించినట్టి వెట్టి
గొల్లనికి నీకు విద్యలగోల యేల

గీ. ధర్మతనయుఁడు నడచిన దారిఁగాక
మాఱుత్రోవను జనుట మా మతవ
లేకయుండిన ద్రౌపది శోక మార్ప
నీవుది కైకొతి వన్న గోడేల మాకు.

అర్జు— (తనలో) హాస్యవ్యాపారము మర్యాదలను గూడ నతిక్రమించుచున్నదే. (ప్రకాశముగా) ఆర్యా! భీమసేన! నేనును సుయోధనుండును రణసాహాయ్యంబుగోరి యేకకాలంబున ప్రార్థించినను గొండొక నెపంబుఁ గల్పించి మనయందలి పక్షపాతము చేత మనకు బాసటగా వచ్చిన యీ మహానుభావున్ దురుక్తులాడి విరక్తునిం జేయుచున్నావు. అతనిగోడే మనకు సర్వదా కావలసినది.

మ. చెలి చుట్టంబు మహానుభావుఁడు కృపాసింధుండు మాన్యుండు గా
క, లఘుత్వంపుఁ బ్రశంసకుం దగునె? నీకార్యంబు సాధించుకోఁ
గల నైపుణ్యము ని వెఱుంగ వనునే కాకట్లు మేనత్తపు
త్రుల మంచించుక మేల మాడఁదగదే? రోసంబు రాఁబాడియే?

భీము— అర్జునా! నీకు దెలియదు. మేఁ మాటలకు దేశకాలపాత్రం
బులు లేవా?

మ. బకునిం జంపితి రూపు మాపితి హిడింబాసోదరున్; దుష్టకీ
చకులం దున్మితి మొన్న నాగ్గురిఁ; జరాసంధున్ దురాసంధు నే
నొకడం జంపితి నాకు మునకు వేఱొక్కండు తోడేల! యె
న్నక న న్నిగతిఁ బోరికిం బెదరు చున్నాఁడం చనం బాడియే?

ఉ. పుట్టినదాది పేరయిన పోటుతనం బొకయింత లేక రా
పట్టితనంబుజాడఁ గనుపట్టగ నీయక వ్రే వెలందులం
జెట్టకుఁ జేరఁ దీసి పలుచెట్టలు చేసిన యొక్కగొల్లరా
చుట్ట మెఱుంగునే? భువనశూరు సమీర కుమారు బీరమున్.

నకు— (తనలో) అన్నగా రేలొకో మన్ననకుందగిన వెన్నునిపై నెన్నఁ
డును లేని చిన్నతనంబుఁ జూపించుచున్నారు. (ప్రకాశముగా) ఆర్యా!
జరుగఁ బోవునది యొకటియు జరుగుచున్నది మఱొకటియు నగుచున్నది.

క. జనకుఁ డగు పాండుభూపతి
చనినప్పటినుండి యే దోసంగులు రాకుం
డ నిరత మీయన గాదే
మనలను గాపాడుచున్న మానిసి తలఁపన్.

అట్టివాఁ డొక్కమాట యొకసక్కెమునకై యాడిన సహింపరాదా?
కాక,

ఉ. గొల్లఁడు గొల్లఁ డంచు వినఁగూడనిపల్కుల నిట్లు దూఱగాఁ
జెల్లునె యాపరాత్పరుని దెయ్యో లెఱింగియ కాదె యన్నయుం

దల్లియు నెప్పుడుఁ గురుపదంబుగ నెంతురు దానికైన నీ
యుల్లములోపలం దలఁప వృత్తయుమాయెకకోపి వక్కటా!.

భీము— తమ్ముడా! మద్రభూపాలప్రథమదౌహిత్ర! యేల యీ నిరర్థక వాక్యములు. మీరందఱు అతని యడుగులకు మడుఁగు లొత్తిన నొత్తుదురు గాక.

గీ. చావకుండ నితఁడె సంరక్షణముఁ జేసె
నొక్కొ? యక్కతోడ లక్కయింట
గూడఁ దోడువేదమై డాసె నీతఁడే
యిడుము లడవులందుఁ గుడుచునపుడు.

సహ— ఆర్యా! కనిష్ఠసోదరా! ఏల యీ యప్రస్తుతప్రశంస! మున్నెన్నఁడును మన కుపకారము చేయకయే పోవచ్చును. ప్రస్తుతమున,

ఉ. సాయము చేయ వచ్చెఁ గద! శౌరి, యతం డొకమేల మాడ న
న్యాయముగా గుటుంబకలహంబునకుం దగితీవు చాలు! నీ
కోయనసంబు బైటఁబడ గోడలకుం జెవు లుండు నయ్యయో!
దాయలు విన్న లోకువగదా! యనియైనను మిన్నకుండరే.

అదియునుగాక యథార్థ మాలోచించినను—

ఉ. తాతయు నగ్రజయున్ గురులుఁ దక్షిణజోదులుఁ జూచుచుండఁగాఁ
బాలకు లీడఁబోక మనభార్యను బట్టి పరాభవింప నా
నాతికి మానరక్షణ మొనర్చినయట్టి మహోపకారి ని
న్నితఁడు శౌర్యహీనుఁ డని యారసమాడిన లోప మున్నదే.

భీము— ఛీ! ఛీ! కుజ్జవానిచేతఁ గూడ నింతలేసి మాట లనిపించుకొనుచున్న యీదురభిమానపు బ్రతుకేల? ఇదిగో! ఈగదాదండమున నం దల వ్రయ్యలు చేసికొనియెద. (గద పుచ్చుకొని) ఓ గదాదండమా!

చ. వెలఁదిని గొల్వులోఁ బరిభవింపఁగఁ జూచుచు నున్నకౌరవ చే
తుల నిముఁ దాల్చి నిక్కముగ నుర్వ్యశముం గొని తెచ్చి నీకుఁ ద
త్ఫలముగ నేఁడు వానితల వ్రయ్యలుచేసి యశమ్ముఁ గొమ్ము నీ
తలఁపగు వీరపుంగవుని తావునకుం జని నీకు మ్రొక్కెదన్.

ద్రౌప— (భీముని చేయిపట్టుకొని) ఆర్యపుత్రా! శాంతింపుము శాంతింపుము. పగఱ గెల్చుటయు లేక చచ్చుటయు నాఁడు చేయందగినవి కాని నేఁ డీవృథాప్రాణత్యాగ మేల? "హాస్యంబునకు దేశకాల పాత్రంబులు లేవా!" యని మీ రుగ్గడించిన పలుకు మిగుల లెస్స పలుకు; పాత్ర మెఱుంగక మేలమాడిన యీ తప్పు ద్రౌపదిది కాని మీయది కాదు. నాథా! యీ దీనురాలి నేమిచేసెదరు? నాపరాభవానలం బార్పువారెవరు? నే నిఁక ముందనాథ నగుదునా! ముత్తైదువ నగుదునా? చాలితిరేని మీ యైదుగు రేకవాక్యంబున నక్కురుకులపాంసనుల జంపి యంగుటంబు మొదలొదలవఱకు బగ్గుబగ్గున మండు మదీయపరాభవానలంబుఁ జల్లార్పుఁడు. లేదేని రణరంగంబు నందైన వీరస్వర్గ మనుభవింపుఁడు; ఈ యొక్కటి దుర్మరణంబు వలని ప్రయోజనం బేమి? ఓ దేవా! అజాతశత్రూ! మున్నరణ్యంబునఁ జెలియలి వావియైనం దలంపక నన్నుం జెఱఁగొన్న సైంధవునిం గట్టి తెప్పించినగతి నీ సుయోధనాదులం గట్టి తెప్పించుటకునైన నీతమ్మునకు సెలవిమ్ము.

భీము— పాంచాలీ! నన్ను వారింపకుము.

ఉ. ఎమ్మెయినైన యుద్ధమున కియ్యకొనండు యుధిష్ఠిరుండు, మ
ర్మమ్ములు దూఱనాడుచుఁ "బరాభవమా" యనియెత్తు వీవు; లో
కమ్మున నీగతిం బ్రతుకుకంటె సుఖం బగుఁ గాక మీఁద దుః
ఖమ్మగుఁగాక చచ్చుటయె కర్జము మానికి మానినీమణీ!

ధర్మ— (భీముని సమీపించి) నాయనా! భీమసేనకుమార! నీవేల యీ యాత్మహత్య కొడంబడెదవు! ఓ వాసుదేవా! గోరులతోఁ దును

మఁదగినది గొడ్డలితోఁ దునుమునట్లు చేసితివి గదా! ఓ పాంచాల రాజపుత్రీ! భీమకోపానలంబుఁ బ్రజ్వలింపఁజేయఁ గట్టెలు వీఁకివి పెట్టినట్లు మాట్లాడుచుంటివి గదా! ఓ సహదేవకుమార! ఒడలు నొచ్చిన నెన్నఁడును నోరులఁ జిన్న మెత్తుమాట యననివాఁడవు గురువులదెసనా యుపచారము ?

ఉ. జూదరివై కళత్రమును శోకముపా లొనరించి తల్లి దా
యాదులయింట నుండఁగ మహాటవిపాలయి తమ్ముగుఱ్ఱలం
గాదిలిపెండ్లముక్ వెతలఁ గ్రాఁచిన జూదరి యుండ మాని యిం
దేదియు లేని భిముపయి కేగెద వేల గదాప్రహారమా!

కృష్ణ— (తనలో) వ్యవహారము ముదురుచున్నది కావున మరల భీమసేను నెప్పటియట్లు కావింపవలయు. (జనాంతికముగా) ధర్మతనూభవా! ఏమిది నీకుఁగూడ నీవెఱ్ఱి! ఊరక చూచుచుందుము. ఇంతలో వాయునందనుని ప్రసన్నునిం జేసెద. (ప్రకాశముగా) బావా! భీమసేన! ఖేద మెఱుంగని మీపెద్దన్నగారి మదికిఁగూడ ఖేదము గల్పించితివి. నీవే యిట్లు సాహసించితివేని—

ఉ. భీకరమై యగాధమయి భీష్మగురుప్రముఖోపలాకులం
బౌ కురురాట్చమూజలధి కడ్డముగాఁ జనఁగా భవచ్చమూ
నౌకను ద్రిప్పఁగాఁదగిన నావికుఁ డెవ్వఁడు! నీవు లేక యీ
శోకము తీఱునే ద్రుపదసూతికి నిక్కము వాయునందనా!

గీ. అన్నమాట లాలించి నీ వన్నమాట
లబ్బురము దోపఁజేయ నే నట్టు లంటిఁ
గాని యెవ్వరు నీ పరాక్రమ మెఱుఁగరు
సమయ మిదె వచ్చుచున్నది శౌర్యమునకు.

అదియునుంగాక చిన్నతనంబునుండి దురాత్ములగు సుయోధనాదుల చెడుతలంపులకు నీవ తగియుంటివి.

శా. క్రాటం గట్టిరి నీఁట ద్రోచిరి విషద్రావంబుఁ ద్రాగించి రా
రాజాంగణంబు నడి "నీవు నీద్యపతిసం బోరాంబు బకింపిత్కారిం
బాటింకం బసదా" నటంచుఁగద; యాహా! యట్టిశత్రుత్వ మె
వ్వాటం దోఁగితో! యెట్లు సంధియొనరింప న్నన్ను ప్రేరేచితో?

భీము— (కోపము చాలించి) కృష్ణా' మాటిమాటికి నాచేత నేల ప్రేలిం
చెదవు.

ఉ. ఇంతిని గొప్పుఁబట్టికొని యీడ్వఁగఁ జూచితి నెందుచేతనో
వంత దురంతమైన వనవాసముఁ జేసితి నెందుచేతనో
శ్రాంతి వహించి యొక్కనిదెసం గొలువుండితి నెందుచేతనో
శాంతి వహించి యీపగిది సంధి కొడంబడు టందుచేతనే.

ఐనను సంధివచనప్రస్తావంబున నాంబికేయునితో నిట్లనుము.

ఉ. పాండునృపాలకుండు జనవంద్యుఁడు నీయనుజుండు రాజ్య మా
తండె భరించె మొన్న చనుదాఁ కిపు డింటికిఁ బెద్ద వయ్యు నం
ధుండవు గాన నీసుతులతో సరిగా ధరఁ బంచిపెట్టి పై
నుండుము నీకుమారుల మహోదయముల్ వినుచుం సుఖంబుగన్.

అట్లు పంచిపెట్టుట కంగీకరింపవేని.

ఉ. ఆలములోన నీసుతుల నందఱి నొక్క గదాభుజంగికిం
బాలొనరించి వచ్చిన నృపాలురు చూడఁగ నిచ్చువాఁడ నే
నూళులు తిండికిం బ్రతికియుండిన మీకును, 'దాసి'వంచుఁ బాం
చాలిని నవ్వినట్టి దొరసానికి భానుమతీవధూనికిన్.

ద్రౌప— నాథా! కార్తిక రాకాసుధాకర తరుణ కిరణ సమశీలంబులగు
నీ చల్లని మాటలచే నామనోవ్యథ తీఱినట్లే యున్నది.

భీము— ఓ పాండవగేహిని! పాంచాల రాజపుత్రి!

క. కొలఁదిదినంబులలోఁ గురు
కులకాంతలకుతిక్రొతటి కొలుకులతోడన్

గులికను సికనుఁ గొలఁకులఁ
గలికి! యానంద బాష్పకణములు జాఱున్.

కృష్ణు— (తనలో) ఇప్పటికి మదించి యాలానం బూడఁ బెఱికి చెలరేఁగిన మత్తగజము మరలఁ గట్టుకొయ్యకుం జేరినది. (ప్రకాశము) ఓ అర్జున నకుల సహదేవులారా! మీరు చెప్పవలసిన మాట లేమైన నున్నవా?

అర్జు— గీ. నుడువవలసిన దంతయు నుడివె ధర్మ
తనయుఁ, డీ వేగుచుంటివి దైవమూర్తి
వింకఁ గొదవేమి సంధిఁ గావింప నొండె
పోరుఁ బొసగింప నొండె నీభార మయ్యా!.

ఐనను మనుజసహజం బగు నహంకర్తృత్వంబున నానుడువు పలుకు లుపదేశం బని తలంపక యాకర్ణింపుము.

క. చిరభుక్తమైన నేల న
చిరానుభూత యగు ప్రేయసింబలె బలవ
త్తర మగు విధిచేఁ గాకె
వ్వరు విడువం జూతు రయ్య వసుదేవసుతా!.

అందును భీష్మ ద్రోణ కృ పాశ్వత్థామ ప్రముఖ నిఖిల మహారథిక సమవష్టంభన ద్విగుణీకృ తావక్రవిక్రమగర్వుండును నయవినయ వశీకృత సకలరాజచక్రతోష్టూయమాన సంపత్పర్వుండును దుశ్శాసనాది సహోదర శతకభుజావరణ సంభావిత సహజధైర్య ప్రాసాదాసాదిత రాధేయాభిధేయు సింహాసనాసీనుండును సహజ దుశ్శీల కపట సముపాయానుశ్రవీకృత తాతుండును నగు సుయోధనుం డేల విడుచును?

గీ. వాఁడిములు మోపినంతైన వసుధ యొసఁగ
ననుచు సూచించెఁ గద! సంజయుని మొగమునఁ

బాలనక నిక్కమైదూళ్లె చాలు నసిన
లబ్ధి లేదు గదా! యేల లాఘవంబు?.

అది నాతోఁదిన తెలిఁగది యిట్లుండ సభాముఖంబునఁ గులవృద్ధగు గాంగేయునితోడను గులాచార్యుం డగు కుంభసంభవునితోడను నా మాటలుగా నిట్లనుము.

ఉ. సూతుని మైత్రిచేఁ బగకుఁ జొచ్చినగొంటు సుయోధనుండు; మీ
రాతనిపట్లవా రగుట న్యాయము! గాంఢివధారి నయ్యు నే
భీతిలుచుంటి నే మనుచుఁ బెద్దలతో నని సేయువాఁడ నో
తాత! గురుండ! మీరయిన ధర్మము గాదని మందలింపరే!.

అట్లు మందలింపఁ జాలరేని—

గీ. పౌత్రులే యొనరించి రపాయ మనుచు
ఛాత్రులే చేసినా రపచార మనుచు
నెడఁదలోఁ దలపోయక యుం డభయము
సదమదించును వాని మా సాయకములె.

కృష్ణు— కమద శాత్రవకుల ఫణాధర నకులా! నకుల! నీ యభిప్రాయ మేమి?

నకు— జనార్దనా!

గీ. అడవిలో నున్నవేళ రాజ్యాశ మనకు
లేదు, వారికి దుర్బుద్ధి లేదు నిజము;
కష్టముల కోర్చి తుదకు భాగంబుఁ గోరు
నప్పటికి వారికిట్టి దురాశ పుట్టె.

చ. అహమిక చేత నట్లు కబురంపిన నంపిరిగాక మొన్న గో
గ్రహణమునాఁటఁ గోలె మది గర్వము దోఁగక పోరు పాండవ
ప్రహరణముల్ కరం బొడలిపట్లకు నాఁటిన ద్రోణుఁడుం బితా
మహుఁడును గర్ణువారలును మాన్పుదు రేగతి సంధిసేఁతకున్,

పోరికిం గాలు ద్రవ్వకుండుటకు మనబలంబుమాత్రము సామాన్యమే! ధర్మతనయుండు విల్లుపూని నిలిచిన నెదురువాఁ డెవ్వఁడు? తక్కిన పాండవులయు విరాట్ద్రుపద దృష్టద్యుమ్న కాశీపతి చేదిపతిప్రముఖు లగు మహాయోధులయుఁ జక్రరక్షకుఁడ వగు నీయొక్కయు బలపరాక్రమంబు లెఱుంగనివారే! ధర్మతనయుండు సంధికిం జొర నీఁడను గట్టితలంపు గలిగి యున్నంత వట్టును వారిట్టి ప్రగల్భంబులే పల్కుచుందు రయినను సంధి నడపుచు యుద్ధమునకుఁగూడ రంధి నడపుచుందుము.

ఉ. పోరికి సిద్ధమై యడుగఁ బోయినవారము గాన వారు మా
దారికి రాకపోవుట విదారిత కౌరవకంఠర క్త ధా
రా రమణీయ ర క్తిమ మరాళకరాళపృథాకుమార నే
వారతి వీఁగియున్న శరజాలములం బడుయోగ ముండెనన్.

[తెరలోఁ బెద్దకలకలము తరువాత]

క. ఆసన్నం బయ్యెను ముర
శాసన! దేవా! ప్రయాణసమయం బిదె శ్రే
ణీ సముదిత మఁగురవము ది
శా సముదాయంబు వగుల జయముగ ప్రమోగన్.

కృష్ణు— ఇదిగో! వచ్చుచున్నాను. చిన్నబావా! సహదేవా! నీతలంపు వ్యక్తీకరింపుము.

సహ— క. అడిగితిరిగానఁ జెప్పెద
విడుచుట ధర్మంబుగాని విషయముగానన్
నుడివెదఁ దప్పన్నను లో
నిడుకొని నాపల్కులు క్షమియింతు రటంచున్.

ఉ. బీదతనంబు వచ్చెనని పెద్దలు నల్గురు కూడి చేసినం
గాదనరాదుగా కపటు కౌరవనాథునితోడ వేడుకన్
జూదములాడి ధర్మతనుజుండు సమస్తముఁ గోలుపోవ భా
గ్యోదయ మేగతిం గలుగునో మన కచ్యుత! నిర్ణయింపుమా.

పాంచాలీ వరరూపముగా నాంబికేయుండె పునరాజ్యంబు మన కిచ్చెనంటి రేని.

మ. విదితంబే పృథివిం గలట్టి సకలోర్వీనాథులుం జూడ ద్రౌ
పది కయ్యంధనృపాలకుండు పరిభావంబైన పైనిచ్చుటల్;
గదయుం గాండీవముం ధరించువారలే కంజాక్షి యార్జించిన
ట్టిది సీ! సీ! యని రోయ కక్కటిక కూటిం బేర్చి నాసింతునే?

పోనీ! మాయమరోదరంబునఁ గెలిచిన గెలుపు గెలుపు గాదంటి రేని

మ. అభిమానంబు గలట్టి రాజుల కసత్యాలాపముల్ కూడునే?
ప్రభువుల్ గారె నలాదు! లీకరణిఁ బాటించిరే? గల్తురే
యుభయుల్ జూదములం? బరాభవము రా నోడొందువాఁడేల ధ
ర్మభయంబుం గొని గెల్చువారలది ధర్మంబంచు వర్గించెదున్!

కావునఁ బోలుమాట తలపెట్టక బలపరాక్రమంబునకు ఫలంబుగా రణభేరి ప్రయోగింపుఁడు.

మ. దొర యొక్కండన నేటిమాట? బలవంతుం డెవ్వఁడో వాని దీ
ధర; పోరన్ జయమో పరాజయమొ రాదా! గెల్చి రాజన్యులం
దఱు మెచ్చన్ ధరన్నేలుకొంద మటు కాదా? చచ్చి స్వర్గంబునం
దిరుగన్ వచ్చును మంచిక్షత్రియుల కింతే యొండు లే దెచ్చటన్.

కృష్ణు— (చేతితోఁ జఱచుచు) బావా! చిన్నవాఁడనైనను నా మనసు నచ్చినమాటంటివి.

సహ— వాసుదేవా! యీసంధికి సుయోధనుం డొడఁబడఁడేమోయని మాయన్నలును నీవును గడుఁజింతిల్లుచుంటిరి గాని యతఁ డంగీక

రించుట కేవిధమైన సందేహమును లేదు. ధర్మవిదులైన మా యన్నలు యశంబు సంపాదింతురు గాక !

ఉ. అన్నలు ధర్మవర్తను లటన్నయశం బొకఁడున్నఁజాలు వా
రన్నరనాథుసంధికయి యాస వహింతురుగాక వారితో
నెన్నటికేని యాలమది యే నొనరింపకతీర దట్లు కా
కున్నఁ బరాభవమ్ముడుగునో? తల ద్రౌపది యెత్తనేర్చునో ?

ద్రౌప— అన్నా! దీనశరణ్య! యీ యాఁడుకుయ్యి గూడఁ గొంచె మాలింపుము. వేదీమధ్యంబునంబుట్టి ద్రుపదరాజునకుం బట్టినై దృష్టద్యుమ్నునకు సోదరినై స్వయంవరంబున సకలరాజన్యచక్రంబులం జించి చెండాడిన మేటిదొర లైదుగురకుం గులసతినై విశేషంబుగా నీకుం జెలియలినై యొక్క కులపాంసనుం డంటరాని సమయంబునం గొప్పుపట్టికొని యీడ్చి కొల్వులోపలఁ గట్టు పుట్టంబు లూడ్చి పరిభవించిన నోర్చితి! పండ్రెండు వత్సరంబులు వనవాసంబును నొక యేఁ డజ్ఞాతవాసంబును సలిపితి; ఇన్ని యిడుములకోర్చి బ్రతికియున్నందుకు ఫలముగా నా కౌరవచండాలుర చావు వినుట తప్పఁ దక్కిన కల్మిలేముల కాసించుదానఁ గాను; వేయేల ? యిమ్మోటిమగలకుఁ బౌరుషంబు వచ్చునని కదా! నేఁటికిని దుశ్శాసనాకృష్టచ్ఛిన్నంబులగు తలవెంద్రుకలు ముడువక కట్టుపుట్టంబు విడువక జీవించుచుంటి; ఇప్పటికిని నాప్రతికూలదైవంబు వదలి నానోములు ఫలింపకున్నవి.

కృష్ణు— అమ్మాయి! యిఁకఁ జాలింపుము. నీమనోగతం బెఱుంగుదు.

గీ. మున్ను నీవు సహించినయన్నినాళ్ళు
సైఁప నక్కఱలేదు సంతాపభరము;
వచ్చుచున్నది నిజము నీవలెనె కురుక
ళత్రములుగూడ నేడ్చుకాలము పురంధ్రి!.

[తెరలో—"ఆసన్నం బయ్యెను, మురశాసన" అను పద్యము మరలఁ జదువుదురు.]

కృష్ణు— బావలారా! నా కందలు సెలవిండు. ముహూర్తము దాయ వచ్చినది.

(అందఱును గొంతదూరము సాగనంపుదురు.)

ధర్మ— (తనలో) కురుకుల దేవతలారా! ఓ పంచభూతములారా ! నా యెడల దయయుంచి మావంశము నాశీర్వదింతురుగాక.

చ. పరమకృపాళు మాయుభయపక్షమువారికిఁ జుట్టముం జరా
చర మయి నైనయీజగము సర్వముఁ బ్రోవఁగ జాలువాని ధీ
వరు వసుదేవనందనుని వారలయొద్దకు సంధి సేయఁ బ్రా
మ్మఱ నిదె పంపుచుంటి బతిమాలుచు యుద్ధభరంబు మాన్పఁగన్.

(ప్రకాశము)

గీ. తిమ్మి యనఁ దిమ్మి యగు నిది బ్రమ్మి యనఁగ
బ్రమ్మియే యగుః నీవు, వేపలుకు లేల
యిచ్చవచ్చినయట్లు చేయింపు మయ్య,
యిరు తెగలలోనఁ గానివా రెవరు నీకు ?

(అందఱును నిష్క్రమింతురు.)

గద్య

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁ
బడిన పాండవోద్యోగమునందు
ద్వి తీ యాం క ము .



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవోద్యోగము

## నాటకము

## తృతీయాంకము

[పిదప వృద్ధపురోహితుఁడు ప్రవేశించును.]

వృద్ధు— గాంధారీసహితుం డగు నాంబికేయునిచే సపరివారంబుగా మురారిం దమయింటికి యథావిధిగాఁ దోడుకొని రమ్మని నేనే నియోగింపఁబడియు మధ్యమపుత్రుండగు త్రివేదిం బంపించితి. పెద్దవాఁడగు ద్వివేదిని రాజాగారంబుననే యుండ నియమించితిని గదా! ఇఁకఁ జంటివాఁడు చతుర్వేదియు నేనును మాయింటి కతిథులై చనుదెంచిన మునీంద్రగారలకుం దగిన యాతిథ్యముఁ గావించుచుంటిమి.

ఉ. ఎన్నఁడు రాని పెద్ద లిపు డింటికి వచ్చిరి వారడించి నేఁ
జన్న కపింతు రానృపతి సద్మములోనికిఁ; బెద్దవాఁడ నౌ
ట న్ననుఁ బిల్వనంపి రకటా! యిపు డేమియొనర్చువాఁడఁ గా
నున్నది కాగమానదు సుయోధనుఁ డేమియొనర్చునో తుదిన్.

గీ. సత్యవతి పెంచెనఁట మున్ను జనని లేని
పిల్లవానిని మాతండ్రి నెల్లయాజి,
నంబికాదేవి పెంచె నన్నట్లు; నొకట
యీడువారము ధృతరాష్ట్ర నృపతి నేను.

కావునఁ జిన్ననాఁటినుండియు నతనికి ముఖ్యమిత్రుండనై పౌరోహిత్యంబుపేరి సామ్రాజ్యమే యనుభవించితి. శ్రీకృష్ణునిరాక సంధి కొఱకని యెఱింగి నాతో నేమేమో యాలోచించుటకే కాఁబోలు వైయాసకి నాకుం గబురంపె; ఇంతకుఁ గొఱుకరాని కొయ్యలు సుయోధనాదులు తండ్రిమాట వినరు భరతకులంబున కేదియో చేటు మూఁడినది. ఛీ! ఇంతదిక్కుమాలినయాశ కూడదు. పాప మాపాండవులు బిచ్చగాండ్రవలె నైదూళ్ళిచ్చినఁ జాలు ననఁగా నేల యీరాదు? సాక్షాత్పరాత్పరుఁడు కృష్ణుఁడు సంధి చేయవచ్చునని యంగీకరించునేమో! (పెదవి విఱిచి) అబ్బే! వీనికి గురువు లేఁడు దైవము లేఁడు. వీని నింతనాఁటనుండి యెఱుఁగుదును.

గీ. కర్ణుఁ డనుకర్ణధారుఁ డేకడకుఁ ద్రిప్పు
నాకడకుఁ బోవుఁ గురునాథుఁ డనుకలంబు;
పలుఁగు లాతనితమ్ము లాపడవపలుపు
లాదరికె లాగఁ జూచెద రనుకలంబు.

ఓరీ! శకునిగా! నీవే యీభరతకులనాశంబుఁ దెలుపు తిత్తిరిశకునివి. ఓ రాధాకుమారా! ఒడలికవచకుండలములు గూడఁ దెగఁగోసి యిచ్చిన మేటిదాతవు శరీరముతో వేఱుగాని నీవే సుయోధనుండవు సుయోధనుఁడే నీవు కావున,

ఉ. ఈగికి వెన్కఁదీయకు మహీంద్రశయానుఁడు పాండుపుత్ర భూ
భాగము సంధిపేరిట నెపంబున నిమ్మడుగంగ వచ్చెఁ జూ

(ఆలోచించి) అయ్యో! ఎంతవెఱ్ఱినైతిని; నిన్నదియొక్కటియే గోరఁ దగనిది,

భాగముమాటటుంచుము సెబా! సవమానము సేయకుండఁగా
నేగతి వచ్చునో యటులనే చననిచ్చినఁ జాలుఁ గృష్ణునిన్,

(ఆకాశమువంకకుఁ జెవియొగ్గి తనలో) ఎవరో తలుపుదగ్గఱ బిగ్గరగా నఱచుచున్నట్లున్నారు. (ప్రకాశముగా) ఎవరయ్యా! అఱవఁబోకుఁడు; మార్గాయాసంబునం బడలి జడదారులు కునుకుచున్నారు. (మరల నాకసమువంకఁ జెవియొగ్గి తనలో) ద్వివేదిమాటవలె నున్నదే! (ప్రకాశముగా) నాయనా! ద్వివేది! పెరటితలుపుదారిని రమ్ము. ఈగుమ్మము తెఱచుటకు వీలులేదు.

ద్వివేది— (పెరటితలుపుదారిని ప్రవేశించి) తండ్రీ! నమస్కారము.

వృద్ధు— సుఖీభవ! (ఆశీర్వదించి) నాయనా! మురారిని యథావిధి పురస్సరంబుగా మన త్రివేది ముసలిరాచనగరికిం దోడికొనివచ్చెనా! అచటి విశేషము లేమి?

ద్వివేది— ఇప్పటి కేవియును లేవు.

చ. విదురునితో నెదుర్కొని త్రివేది యొనర్చిన యర్ఘ్యపాద్యముం
పదఁ గొని వారితోఁ గలిసి పట్టణకాంతలు చల్లుసేసలె
ల్లఁ దనశిరంబునం బడ విలాసముగాఁ జనుదెంచెఁ గామినీ
మదనుఁడు శౌరి మత్తగజమందగతిన్ ధృతరాష్ట్రునింటికిన్.

వృద్ధు— తరువాతఁ దరువాత.

ద్వివేది—మత్సమర్పిత చందన తాంబూలాదులు కరంబునం దాఁకి సర్వశృంగారితం బగు బంగారుగద్దెమీఁదఁ గూర్చుండి చుట్టుం బరివేష్టించి యున్నతాసనంబుల నున్న మనదొరలతో నుచితప్రసంగంబు గావించుచుఁ గొంతతడ వుండి—

క. విదురాదులయింటికిఁ జని
యెదఁ గా కని లేచి యంధనృపదంపతులం
జదురున వీడ్కొని కుంతీ
సదనమునకుఁ జనియె విగురసహితుఁ డగుచున్.

వృద్ధు—తన్న కొడుకులు కానలపాలై కుందుచు ండదాయాదుల యింటం గుడుచుచు నడలుచున్న కుంతికన్ను కిదియే మొదటిపండువు తరువాతఁ దరువాత.

ద్వివేది—తరువాత దుర్యోధనమందిరంబునకు బోయి యచట "విందార గించు" మని యెంత వేఁడినను బగఱయింటఁ గుడుచుట తగదని తగినసమాధానంబు చెప్పి విదురునియింట భుజించుటకుం జనియె. నేనును మఱలి వచ్చితిని.

వృద్ధు—శ్రీకృష్ణుఁ డేగునప్పటికి రారా జేమి చేయుచున్నాఁడు ?

ద్వివేది—కర్ణ శకుని సైంధవప్రముఖులతోఁ గొల్వు దీర్చియున్నాఁడు.

వృద్ధు—(పెదవివిఱిచి) కావుననే శ్రీకృష్ణుఁడు కౌరవరాజు ననాదరించి నాఁడు. అదిగాక మొదటినుండియు బలరాముని సుయోధనుని యందును శ్రీకృష్ణునకుఁ బాండవులయందును నభిమాన మెక్కుడు. ఈ యభిమానములకతముననే కదా ! ఆపెండ్లి కన్నిచిక్కులు ఘటించినవి ?

చ. "పరమపవిత్రుఁడే నొసఁగఁ బట్టిని ఫల్గుననూతి" కంచు సం
బరపడి సీరి లక్ష్మణకుమారకు నేరి యొసంగెఁ బెండ్లికిం
దరలితి మావివాహపువిధానము లేమనఁ! జావు తప్పి వ
చ్చిరి దొర, లాఘటోత్కచుఁడు చేసె వివాహము పార్థనూతికిన్.

ద్వివేది—వెనుక సుభద్రమ్మగారిని గూడ బలరాముఁడు దుర్యోధను నకే యీఁదలంపఁగా కృష్ణుఁడు పార్థునకుఁ బెండ్లి చేసెనని విందుము.

వృద్ధు—అవును. మొదలనుండియుఁ గృష్ణునకుఁ బాండవులయందే పక్ష పాతము.

ద్వివేది—నాకు సెలవిండు. త్వరగ భుజించి మరల సభాముఖంబున కీ ఋషుల నందఱిని వెంటనిడుకొని పోవలయు.

